పట్టభంగరాఘవ మను

# పాదుకాపట్టాభిషేకము

ఇది

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారిచే
రచింపఁబడినది.

★

ప్రకటనకర్త:

కురుకూరి సుబ్బారావు సన్,

(స్వరాజ్య వేంకటసత్యనారాయణరావు)

ప్రొప్రయిటరు:

సరస్వతీ బుక్ డిపో, విజయవాడ.

[illegible] కూర్పు 1000 ప్రతులు

బా[illegible] ప్రెస్, బాపీనగర్, గుణదల.

1955



వెల 1—12—0

# ఇందలి పాత్రములు

**పురుషులు**

- దశరధుడు — కోసలదేశాధిపతి
- రాముఁడు, భరతుఁడు, లక్ష్మణుఁడు, శత్రుఘ్నుఁడు — దశరధపుత్రులు
- వసిష్ఠుఁడు, జాబాలి — మునులు
- సుమంత్రుఁడు — రాజమంత్రి
- భద్రుఁడు, కమఁడు — ద్వారరక్షకులు
- విజయశర్మ, సోమనాథుఁడు, సుచిరుఁడు, భ్రమరకుఁడు, శివదు — బ్రాహ్మణులు

**స్త్రీలు**

- కౌసల్య, సుమిత్ర, కైకేయి — రాజభార్యలు
- సీత — రాముని సతి
- మంథర — కైకేయి పరిచారిక

&C. &C.

★

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# నాంది

చ. సురలకు నైన యోగులకు సూరుల కైనను సత్తపోవ్రతా
చరణుల కైన ధ్యానమును సల్పుట కందగరాని మంగళా
కర రఘురామపూత పదకంజము లాదల నెప్పుడూని యా
భరతుని దుఃఖ మార్చిన శుభప్రదపాదుక లోము మమ్ములన్.

[నాంద్యంతమందు సూత్రధారుఁడు]

ఏమి నాపుణ్యము! యీరాత్రి నీ సభాసదులచే శ్రీరామచంద్రమూర్తి కథను నాటకరూపమునఁ గనఁబఱుప నాజ్ఞాపింపబడితిని.

తే. గీ. బొమ్మలను గింజలను దాల్చి ముదముగొల్పి
పిల్లలకుజ్ఞాన మొసఁగెడు విద్యఁబోలి
సరసనాటకీకృతపూతచరిత మిద్ది
భక్తిముక్తిదమౌ జనమ్ములకు నిలను.

కాని దీనిమహత్త్వమే మత్కార్యభారము నినుమడించుచున్నది. తోడు లేక యేకార్యముఁ జక్కఁబడదు గదా! అందులో నాటక ప్రదర్శనమున కది యత్యావశ్యకము.

తే. గీ. మనసున కితరవిషయసంభార మెట్లు
వలయు నైహిక కార్యనిర్వహణమునకు
నట్లె నాకును నాటకమందుఁ బారి
పార్శ్వకాదులు సాహాయ్యపడఁగవలయు.

(అప్పుడు పారిపార్శ్వకుఁడు ప్రవేశించును)

పా — నన్నుఁ బేర్కొనుచున్నారు. ఏదో క్రొత్తనాటక మొకటి యాడవలసివచ్చినట్లున్నది.

సూ — ఔను పారిపార్శ్వకా! బాగుగ నూహించితివి.

పా — కవినిబట్టి గ్రంథప్రాశస్త్యముఁ గనుఁగొనవచ్చుఁ గాన యీ నాటకమును రచించినవారెవరో చెప్పెదరా!

సూ — పానుగంటి లక్ష్మీనరసింహరావు.

దానిలో నల్లిపూవులు దవిలె రెండు
వక్రచారిత్ర మందరావనిత, కైక.

ఆయినను వారిం దూఱనేల?

తే. గీ. మేనిచెమ్మటచేతఁ దెమ్మెరలహాయి
గులకఱాలచే వజ్రాలకుఁ గలవిలువ
చూడఁబడునట్లె రఘురాము సుగుణవితతి
ప్రకటితం బయ్యె వీరి వక్రత్వమునను

పా—రాధాకృష్ణనాటకమున భక్తిశృంగారములు గలిసిన ట్లీ నాటకమున భక్తికరుణములు గూడినవికదా! వానికిఁగూడఁ బరస్పర సంబంధ మున్నదా యేమి?

సూ—

తే. గీ. దైవమునుగూర్చి తచ్చరితంబుఁగూర్చి
విమలచిత్తత భక్తుఁ డేవేళఁ దలఁచు
నాతఁడిని మేను గంపింప నతని కన్ను
దోయి బాష్పపూరంబులఁ దొఁగుచుండు.

కావున భక్తికరుణములకుఁ జేరిక యున్నదో లేదో నీవే యోజింపుము.

పా—ఆహా! యేమి యీరసస్వభావము! ఇప్పుడు నే జేయు వలయు సాహాయ్య మెద్దియో శీఘ్రముంబె సెలవిండు

సూ—మఱేమున్నది? నీవు పోయి యేతన్నాటక ప్రదర్శనా వశ్యకపాత్రపరికరాదుల సిద్ధంబు చేయవలయును.

గీ. దశరథుఁడు వసిష్ఠర్షి మంతనముఁ గొనుచు
నతనిసుతు రామచంద్రపట్టాభిషేక
కార్యమును జేయఁ బూనిన కరణిఁగాఁగ
వేగఁ గావింపు పనుల నిర్విఘ్నముగను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

—(:o:)—

# శ్రీ పట్టభంగరాఘవ మను

# పాదుకాపట్టాభిషేకము

## ప్రథమాంకము

ప్రదేశము—అయోధ్య—దశరథుని సభాశాల

(ప్రవేశము...దశరథుడు వసిష్ఠుడు సుమంత్రుడు.)

దశ—మంత్రీ! తలచుకొనినపని శీఘ్రముగా సాగకుండ నిది యెంత యంతరాయము గలిగించినది?

వసి—మీరు సందేహింపవలదు. అది యనావశ్యకమే కాదని నాయభిప్రాయము.

దశ—ఎందుచేతనో యానతివ్వవలెను?

వసి—అది యిదివరకే జరిగింపబడుటచేత—

దశ—భగవానుఁడా! అదియెట్టులు?

వసి—గీ. వంచ నెంచి రాజులు తల వంచుకొనిరి
యెత్త నెంచి యంజలి తల కెత్తుకొనిరి
యట్టి హరువిల్లు చెఱకును హస్తినలెను
విఱిచె నతఁ డది దిగ్జయువిధము కాదె?

అఖిల రాజన్య మూర్ధన్య రాజసాంద్ర మగు తత్సభలో శ్రీరామచంద్రునిచే జరిగింపఁబడిన యీమహాకార్యముకంటె దిగ్విజయ మేమున్నది? ఆవశ్యకమనియెవ్వరో మీతోఁ జెప్పిన దిగ్విజయమర్యాద యీ రూపకముగఁ దీఱినది. కావున నీవు సంకల్పించుకొనిన శ్రీరామచంద్ర పట్టాభిషేక మవశ్యము జరిగింపవచ్చును.

సుమం—పునర్దిగ్విజయమున కవకాశ మేమున్నది? అందఱును సామంత రాజులే యయినపుడు దిగ్విజయ మెట్టులు?

దశ—వసిష్ఠభగవానుఁడా! సుమంత్రుఁడా! మీ యిద్దఱి యభిప్రాయమును దిగ్విజయ మిపు డనవసరమనియే కాదా?

వసి } ఆ—
సుమం }

దశ—అటులైన దాశరథి పట్టాభిషేకమును వెంటనే చేయుట కభ్యంతర మేమున్నది?

వసి—ముహూర్తనిర్ణయము.

వసి }
సుమం } —హరి! హరి!

సీ. బహుయాగవితతిచే నహితానైరిముఖదేవ
    తానీకసంతుష్టి నాచరించి
అమరారిజంతుబాధాహరణంబుచే
    నఖిలతాపసతుష్టి నాచరించి
సంతతిచేఁ గన్నసంతతిచేఁ బిత్రు
    దేవతాళిని పరితృప్తిఁ జేసి
గోసువర్ణాంబరక్షోణికన్యాదానంబు
    చేతను విప్రులఁ బ్రీతిఁ జేసి
గీ॥ ఇష్టభోగాళిచేత సంతుష్టి నొంది
యెన్ని యేడులనుండియో యిలను నేలు
చుంటి నింక నెన్నిష్టంబు లుర్విఁబుట్టు
మెడనుగట్టుకొని తిరుగవలయు నయ్య!

గీ. అంచెచివర సమీపించు నశ్వము తన
బరువు వేరొకగుఱ్ఱంబు పైనఁ బెట్టి
సద యొనరని ముదము గనునటులు భువిని
సుతుపైఁ బెట్టి మోదసంగతిని గాంతు

గీ. జగదుపద్రవరీతి మజ్జన్మపత్రి
వైఖరియు స్పష్టవిధమునుబట్టి యేను
దివసములవాఁడ నని తోఁచు దేవ! యిపుడె
పట్టి కీరాజ్యపట్టంబుఁ గట్టరాదె!

వసి—రాజేంద్రా! ఈ దినము బొత్తిగ బాగుగ నున్నది కాదు.

దశ—ఏల?

వసి—ఈదినమునఁ బునర్వసు నక్షత్రమగుటచే, రామభద్రునకు జన్మతార—

దశ—"ప్రథమే ప్రథమం త్యాజ్యమ్" అనినాఁడనియా?

సుమం—(తనలో) ప్రథమకళత్రమందలి ప్రథమపుత్రుని రాజ్యమందుంచ దలంచుచుండఁ "ప్రథమే ప్రథమం త్యాజ్యమ్" అను నమంగళవాక్యములు వచ్చెనేమి? హరి హరీ!

దశ—శ్రేపు పుష్యమీనక్షత్ర మగుటచేత రామునికి సంపత్తారయగును గాదా ?

వసి—శ్రేపు తారాబలమే కాదు. ఉదయలగ్నము రామకార్యమునకు సర్వబలాన్వితమై యున్నది.

గీ. తామరసవైరి పుష్యమీతారఁ జేరి
యుండు పరమపవిత్రముహూర్తమందు
బ్రిథితసౌభాగ్య సామ్రాజ్యభవ్యరమను
రామచంద్రునితోడఁ జేర్పంగవలయు

సుమం—గీ. భవపవిత్రపునర్వసుప్రాంతమైన
పుష్యమీతార యభిషేకమునను నిల్చి
పూతతను జెందు పూజ్యతాపూజ్యత లిల
సదసదంతికస్థితిఁ బట్టి యుదయమగును.

దశ—(తనలో) నిజమే ! రామసాన్నిధ్యమున సౌమిత్రి పవిత్రుఁడగుచున్నాడు. మంథరాసేవచేఁ గైకేయి దుస్స్వభావ యగుచున్నది. (ప్రకాశముగా) సుమంత్రా రామచంద్రు నిటులరథముపై నెక్కించి తీసికొనివచ్చెదవా ?

సుమం—దేవర యాజ్ఞానుసారమే.

( నిష్క్రమించును. )

దశ—మునికులతిలకా !

గీ. పుత్రశోకంబుచే మృతిఁబొంద శాప
మున్న దెపుడేమి కానున్నదో యెఱుంగ
దలఁబరువుఁ జేర్చి రాముని, దండకాఖ్య
వననివాసము నిశ్చయపఱచుకొంటి.

వసి—(తనలో) హరి హరీ ! "రాముని దండకాఖ్యవననివాసము నిశ్చయపఱచుకొంటి"నని యీ రాజేంద్రుడు చెప్పుచున్నాడు.

గీ. ముందువచ్చు మహోత్పాతమునకుఁ దగిన
పలుకిపుడె ప్రాయికంబుగా బయలు వెడలు
వహ్ని పర్వతోత్క్షేపోపద్రవమున
కుఁ దఱచుగ ముందు భూకంప మొదవునటులు

(ప్రకాశముగ)

గీ. అదుగో ! మాతలితోడ బలారిరథమున
వక్షిరా డగ్రజునితోడి భానువలె సు

మంత్రితో రథ మెక్కి రామప్రభుండు
చిన్మయానందమూర్తి వేంచేయుచుండె.

దశ — శెబాస్! గురూత్తమా! రామప్రభుఁడే! నిశ్చయముగా రామప్రభుఁడే! రామునకుఁ బ్రభుత్వ మిచ్చుటకు మీరు సంకల్పించుకొనినతరువాత నాఁగునా?

(నేపథ్యమున) ఆఁగు. ఆఁగు. సుమంత్రా! ఆఁగు ఇచ్చటనే రథముడిగ్గి పాద చారినై తండ్రిగారిని దర్శింతును.

దశ — గీ. రామమందర గంభీరరమ్యారవము
రుద్రవీణారవముఁబోలె రుచ్యమగును
సుతుల పలుకులు వృద్ధులౌ పితలచెవుల
కమృతబిందు నిష్యందంబు లగునుగాదె?

వసి — (నవ్వుచు) రాజేంద్రా! ఏమంటివి? వృద్ధులౌ పితలకేనా? వార్ధకమున సంతానమహోత్సవము గలుగుటచే నిట్లు లున్నది కాని—

దశ — మునిచంద్రమా అందఱి కాత్మజు లనుపమానులేకాని యస్తమయ మదిగో యిదిగో యని యనుకొనుచున్న నా కంతకంటె నెక్కువకాదా? వస్తువు విలువ నావశ్యకతయే యభివృద్ధి జేయును గదా!

గీ రోగయుతునికే యారోగ్యరుచి యధికము
వడదగులువానికే శీతవారి యనువు
బద్ధునకె స్వైరతావాంఛ ప్రబలము మఱి
యొడలు వంగినవానికే యూఁతకోల

రా! నాతండ్రి! రా!

(రామ సుమంత్రులు ప్రవేశింతురు)

రామ—గురూత్తమా! నమస్కారము.

వసి—వత్సా! కల్యాణమస్తు

రామ—తండ్రీ! నమస్కారము

దశ—(కౌగిలించుకొని) నాయనా! చిరాయురస్తు ఈ పీఠమందుఁ గూరు చుండుము. సుమంత్రా! నీవు వివస్వాన స్థలములకుఁబోయి, మన మింతకుముందు తలఁచిన యంశమును వెల్లడించి యందునుగూర్చి జనులయభిప్రాయ మెటులున్నదో ఎఱిఁగిరమ్ము.

సు—చిత్తము. (నిష్క్రమించును.)

వసి—గీ. వనధిపలనను ఘనసునాఘునముఁ బోలె
కర్మమువలన జ్ఞానంబు కరణి లోక

తతిని పథ్యముఁ జేయు నీతండు జనన
మొందె నీవలన; జనమాన్యుండ వీవు.

రామ—(నవ్వుచు) గురూత్తమా! శిష్యునియెడల నమితవాత్సల్యము కదా ?

దశ—వత్సా! నిన్నుఁ బిలిచినయంశ మేదియో యెఱుఁగుదువా ?

రామ—ఆజ్ఞాపింపఁ గోరెదను.

దశ—గీ. ముద్దుబొట్టి మొగమునను మొగమువాచి
వినఁదగినపుణ్యకథ లెల్ల వినుచు మఱియు
నది యనక గుంట యనక మున్గంగఁదగిన
నీటిపట్టుల నెల్ల మునింగి మునిఁగి

గీ. ఎక్కఁగారాని గుట్టల నెక్కి యెక్కి
కనబడినయాళ్ళకును మ్రొక్కి, కడను యజ్ఞ
దైవదత్తనరప్రసాదమున, లేక
లేక, నిన్గాంచితిని బుండరీకనేత్ర !

ఇదిగాక —

గీ. సుతచతుష్టయమున భాగ్యయుతుఁడ నైన
నేను భుజచతుష్టయవిశిష్టుఁడైన
యామహావిష్ణు బోలితి నంచు నీమ
హానుభావుండు కృపతోడ నానతిచ్చె.

గీ. కొడుకు లెందఱున్నను పెద్దకొడుకు తన ము
ఖాగ్రమున నున్నపుడె తండ్రి యలరు మిగుల;
ముందులను పెద్దముల్లు పండ్రెండు చేరి
నపుడె గంటఁ గొట్టెడుగడియార నాటులు

రామ — ఎప్పుడును జెప్పని యీవింతమాటలు నేఁ డేల ?
నావలన నేమైన నేరము కలిగెనా ?

దశ — (నవ్వుచు) నేరము కాదు. కాని, ఉపేక్ష.

రామ — అది యేదియో యానతిచ్చినయెడల దిద్దుకొందును.

దశ — (నవ్వుచు) చెప్పుచుంటిని గాదా వినుము.

గీ. లెక్క లేనన్ని యేండ్లు నే నొక్కరీతి
శ్రమ మనక చేతనైనట్లు రాజ్యభార

మును వహించితి, నీ దేహ మినుము ? వజ్ర
మా ? యింకెన్నాళ్ళు మోయంగ నగును తండ్రి ?
చూచితివా ?

గీ. ఒడలి జవసత్త్వము లుడిగె; ముదుత లివిగో;
కన్నకొడుకవు, ముందుగాఁ గన్నవాఁడ
విట్టి నాక్లేశమును జూచి యిప్పుడైన
భుజము మార్చుకొనఁగ రాదె ముద్దుతండ్రి !

రామ — నాన్నగారూ ! ఇదేనా నా యుపేక్ష ?
దశ — కాదా ?

గీ. వేదవేదాంగములు చదివితివి, సత్య
రతుఁడ, వతిరథుఁడవు మంత్రయుతుఁడ వంత
రరిదమనుఁడవు, వృద్ధవాక్యప్రసిద్ధ
గౌరవుఁడవు, మంగళగుణాకరుఁడ వంచు.

గీ. నీ గురుఁడె పల్కు నాతండ్రి ! నీవు రాజ్య
కలితుఁడై యుండఁ గన్నారఁ గాంచు భాగ్య
మొందఁ గోరితిఁ దనభార ముంచఁదగిన
యాత్మజునికన్నను ప్రియపదార్థ మేది ?

నాయనా ! నీ వెంతమాత్రమును నా కోరికకిప్పుడు మఱుచెప్పగూడదు.

రామ — (చేతులు జోడించుకొని) తండ్రీ ! దేవరయానతిని శిరమున ధరింతును.

దశ — రామచంద్రా ! అటు చూడు — నీకును, నాకును, దేవరయగు నా మహానుభావుని యానతియే యిది.

వసి — ఒక్క నా యభిప్రాయమే కాదు. శ్రీరామచంద్రా ! నీ పట్టాభిషేక మహోత్సవదర్శనమునకై దేవతలుకూడ వేగిరపడుచున్నారు. రేపు ప్రాతఃకాలమునఁ బుష్యమీ నక్షత్రమున నైక్ష్వాక సింహాసనమును నీ వధిష్ఠింతువు గాక !

దశ — తథాస్తు !

రామ — నేను మాఱుపలికితినని మీరు కోపపడక నాయజ్ఞతను మన్నింపవేఁడెదను. అంత నిరవకాశముగ ముహూర్తమును నిర్ణయించితిరేమి ?

దశ — అయిన నేమి ?

రామ — మేనమామయింటికిఁ బోయిన చిరంజీవి భరతుఁడు చిరంజీవి శత్రుఘ్నునితో రావలదా ?

దశ — (నవ్వుచు) నాయనా ! భరతుని కొఱకుఁ బట్టాభిషేక మాఁగవలసినదా?

(నేపథ్యమున) హా! ఆహా!

దశ – వా రెవరు ?

వసి – సుమంత్రుఁడు – (తనలో ఇంకొక మరుపకుత్రి.)

సుమం – సుమంత్రుఁడు ఆహా! ఆహా! శ్రీరామచంద్రమూర్తి మహా మహిమము ? ఆహా! అఖిలజనులాయన పట్టాభిషేకమున కతిసంపముతో నైకకంఠ్యముగ నంగీకరించిరి.

దశ – సెబాస్ – మంత్రీ! రాఘువా! జనవాక్యము రాజుపుల కవశ్యకర్తవ్యము కాదా!

రాజు – తమ యిష్టానుసారమే.

దశ – మంత్రీ! మహోత్సవార్హములగు వస్తుపరియత్నము లతిశీఘ్రముగఁ జేయింపవలయును సుమా!

సుమం – (వసిష్ఠునివంకఁజూచి) మహాపత్రిభూ! చిత్తము.

వసి – సుమంత్రా!

సీ. పూజార్హసంభారములు సున్నము నవ
ధాన్యముల్ సితపుష్పదామములును
నవవస్త్రసంఘంబు నవరత్నములు సార
ఘము ఘృతంబును హేమకలశశతము
తరవారి జాలు శ్వేతచ్ఛత్రమును సమ
లంకృతరథము పేలాలు పసపు
కుంకుమ సర్వశుభాంకయుత గజంబు
పూర్ణమహా పులితోలు స్వర్ణశృంగ

గీ. మహితవృషభంబు మొదలుగా విహితములగు
వస్తువుల నగ్నిశాలలోపలను రాత్రి
యుందె భద్రపఱుపవలె నయ్యె నేను
సమిధలను దర్భల నచట సంగ్రహింతు.

దశ – సుమంత్రుఁడా! వింటివా? ప్రమాదము లేకుండ సర్వసంభారములను జాగ్రత్తపఱుపవలెను సుమా? మునితిల్లకా! రామచంద్రునింక లోనికిబంపుదునా? (నవ్వుచు) ఈ వార్తను దనతల్లికిఁ, దమ్మునికి, వీరికంటె ముందుగఁ దనభార్యకును జెప్పుట యవశ్యమముగ నున్నదికాదా! నాయనా! (కౌఁగిలించుకొని) ఈపాటితో నైన నేను కృతార్థుఁడ నగుదునుగదా!

వసి - రామభద్రా! నీ కొక్క యంశమును జెప్పవలసియున్నది.

రామ - సెలవీయ వేడెదను.

వసి - (నవ్వుచు) నీవు - నీ సతితో - నీరాత్రి -

రామ - (తలవంచుకొనును)

దశ - (నవ్వుచు) మునిచంద్రా? అటుల సెలవిచ్చుచున్నారేమి?

వసి - రామభద్రా! నేను ముసలివాడను గావున, నీ వీసరికి ధర్మోద్ధారకుడవు కావునం, గొంచెము పరిహాసించితిని. ఱేపటినుండి నీవు మాకు ప్రభుడవే యగుదువు. అప్పుడు నీతో నిర్భయముగ మాటలాడనే రాదు.

రామ - మహానుభావా! ప్రభువునైనా ధర్మోద్ధారకుడనైన దేవరకు దాసుడనే.

వసి - నీవు నీ సతితో నీరాత్రి యుపవసింపవలెను. జాగరము చేయవలెను. నీకు జెప్పవలసిన దిప్పటి కింతే.

రామ - చిత్తము.

దశ - సుమంత్రుడా! నీవు రామభద్రుని రథముపై నెక్కించుకొని యంతఃపురములోనికిం దీసికొనిపొమ్ము. నాయనా! నీవును జానకియును నీరాత్రి మీ యమ్మ యంతఃపురముననే యుండుడు. మీకు నిద్రరాకుండ మీ యమ్మ మంచికథలను జెప్పును. సుమంత్రా! కౌసల్యాంతఃపుర మీరాత్రి మిక్కిలి పదిలముగ రక్షించుటకు సేనాధిపతితోం జెప్పుము.

రామ - తండ్రీ! నమస్కారము.

దశ - పుత్రా! కళ్యాణమస్తు

రామ - గురూత్తమా! నమస్కారము.

వసి - కళ్యాణమస్తు.

(రాముడు, సుమంత్రుడు నిష్క్రమింతురు.)

దశ - గురువర్యా! తమ కటాక్షమువలన నాకు విజయము కలుగనైయున్నది. ఱేపటిదినము మనకు మిక్కిలి తొందరగలదినము. కావున సమస్తవస్తువు లీ సాయంకాలముననే సిద్ధపఱుపవలెను.

వసి - అలాగే.

దశ - ఈరాత్రి యెటులగడచునోయని భయముగ నున్నది.

వసి - ఎందుచేత?

దశ - ఏమియులేదు, మంచికార్యమున కంతరాయములు మెండుకదా!

గీ. మనసునకుఁ బ్రీతి యెవనిపై ఘనతరమొ, య
తని కెపుడు కీడు శంకించు మనసె; మగని
యెడల నెంతో ప్రేమం బుండి యెప్పు డతనిఁ
దిట్టు గయ్యాళి యూ భార్యతీరుఁ గాఁగ.

మహానుభావా! ఆలోచించుచున్నా రేమి? పట్టాభిషేక కార్యము జెలువేలునుగద?

వసి – పురుషప్రయత్నముచేత.

దశ – పురుషప్రయత్నముగాక యిందుః స్త్రీప్రయత్న మేమున్నది ? (లేచి) మహానుభావా! నమస్కారము ఇప్పటినుండియు నేనుగూడ నెంతయో శ్రమ మొందినఁగాని యీపటినుహోత్సవము జరుగనేరదు.

వసి – ఈదినమున వారిను దెలుపిలేని పనియున్నది. నేనును బోవలెను.

దశ – గురూత్తమా! నమస్కారము.

వసి – కళ్యాణమస్తు.

(ఇద్దరు నిష్క్రమింతురు)

ప్రథమాంకము సమాప్తము.

★

శ్రీ పట్టభంగరాఘవ మను

# పాదుకాపట్టాభిషేకము

## ద్వితీయాంకము

ప్రదేశము—అయోధ్యలోని వీధి.

(విజయశర్మ యను బ్రాహ్మణుడు ప్రవేశించును)

విజ - ఆహా! ఆహా! అయోధ్య భూలోకవైకుంఠమువలె నున్నది. భగవానుడైన శ్రీరామచంద్రమూర్తి పట్టాభిషేకము జూచు మహాభాగ్యము జనులకు రేపు లభింపనైయున్నది. ఆహా! ఏమి యీ యలంకారసంభ్రమము.

సీ. అంబుయంత్రముల రథ్యాళినిఁ దడపెడు
వారు గోడల వెల్లఁ బ్రాముఁవారు
ముంగిళ్ళ మురిపెంపుముగ్గు లుంచెడివారు
కదళికాస్తంభము ల్గట్టువారు
పెద్దనిచ్చెన లెక్కి వీధితోరణములఁ
గంబాల జెండాలఁ గట్టువారు
నివ్వాళిపళ్లెము ల్నెఱయఁ దోమెడువారు
కేళికూళులఁ బరీక్షించువారు

గీ. నందఱును దమగృహములయందె పెండ్లి
యగునటులు చాల నుత్సాహ మందువారు
భళిర! రామునివంటి శుంభద్గుణుఁడు
కలుగఁ డింతకుముం దింకఁ గలుగబోఁడు.

సీ. బేగిరావులు, నరబ్బీగుఱ్ఱములబండ్లు
వేనవేలుగఁ గోటలోని కేగు
ఘణఘణోద్ధతఘంటికాబద్ధకరిఘటల్
బరువులతోడ లోపలికి నేగు
కాలుబలంబు గుఱ్ఱాలబలంబులు
నెదుట నీటుగ టలాయించుచుండు

దేవళంబుల నుండు దివ్యమూర్తులు దివ్య
వాహనారూఢులై వచ్చుచుండ్రు
గీ. పుట్టనుండెడి చీమలంబోలె జనులు
పెక్కురీతిని నేగుచుం బ్రక్క కొందఱు
నఱచుచుం దమవారిం బిల్చుటను జేత
సన్నఁ జేయుచుం జప్పటల్ జఱచుచుండ్రు.

(చప్పట్లు జఱచుచు) మిత్రమా! మిత్రమా! ఇటురా! (బిగ్గఱగ) సోమనాధుఁడా! ఇటు. (సోమనాధుఁడు ప్రవేశించును)

సోమ — ఆహా! ఇప్పుడే యింతసందడిగ నున్నది. రేపెటు లుండునో?

విజ — నీ వెచ్చటనుండి వచ్చుచున్నావు?

సోమ — విజయశర్మా! సానివీధినుండి.

విజ — నేను శ్రోత్రియుఁడను గాన నచ్చటి విశేషములఁ జూడలేదు. చెప్పెదవా?

సోమ — ఏమని చెప్పను? కాంతలు బురుషులు చెంబులలోని గచ్చకాయల వలె గలగల తిరుగుచున్నారు. రేపటి యుత్సవమున కిప్పటినుండియే సంభారములను సంపాదించు కొనుటయందు సంభ్రమపడుచున్నారు.

సీ. లంగాలలో బొందులం గీలుకొల్పి జా
డించి దండెముల జోడించువారు
చిలుకకొయ్యలఁ దగిల్చిన యుపాంగము లెండఁ
బెట్టి సుక్కలను జీకొట్టువారు
కఱకఱ మనఁ బందికొట్టుచేఁ గుంకుళ్ళ
పులుసున సొమ్ములఁ దోఁచువారు
తిరుగటిగుబుజు మద్దెలమోపి హస్తంబు
చేఁ గొట్టి స్వరములు హెచ్చించువారు
గీ. నెరవునగల కింటింటికి దిరుగువారు
తంబురాల జీవాళిఁ గంబళాంత
రోమనిచయంబు పేనువారు నయి పురుషు
లతివ లతిమోదమునఁ ద్రొక్కులాడుచుండ్రి.

సోమ—సీ. మోమునఁ బసపును బూసి వెడలుపుగాఁ
బట్టెనామముఁ దీర్చి ప్రసవమాలి
కలు దుంపకొమ్ముల గదియించి ఘంటలు
పెద్దమువ్వలు గలపేరు లొడల
జందెంపు నెట్టుగా సమలంకరించి స
సితవృషభంబుల చెంతఁ గొండె
సిగలును వెండిమురుగులు తప్పెటలును
తబుకు తాళంబులఁ దనరి భళిర

గీ. "రాఘవుఁడె రాజు కావలెరా యటంచు"
పాడ నగునంచు మోదించు వసుస నెద్దు
లు, తంబురాల, గొల్లను నవ్వి కుసుమల మదరఁ
దాండవింతురు గొల్లలాదారులందు.

విజ – ఆహా! రామచంద్రునిపై జనుల కెంత ప్రేమ! ఎంతభక్తి

సోమ – అందులకు రెండు కారణము లున్నవి.

విజ – ఏవవి ?

సోమ – రామచంద్రుఁడు సర్వసద్గుణసంపన్నుఁడు ఇది ప్రథమ కారణము.

విజ – రెండవది ?

సోమ – (చెవివద్దకు వచ్చి) దశరథుఁడు దుర్మార్గుడు. ఇతనిరాజ్యము గోస్తనీనదీప్రవాహమువలె నెంత దీర్ఘమో యంత వక్రమైనది. ఇతని పాలనమన్న జనులకు విసుగుగా నున్నది. మొదలే వెలితిపాట. అందుపైఁ తెల్లవారినదాఁక నొక్కఁడే పాటయగుచో వినువారి కెట్టులుండునో జనుల కాతీరున నున్నది. జనులు పట్టాభిషేకమునకు మొగము వాచియున్నారు. మనతండ్రులు చూడలేదు. మన పితామహులు చూడలేదు. మన ప్రపితామహులు చూడలేదు. మన వంశములోని యాదిపురుషులు చూచిరేమో యీ దశరథుని పట్టాభిషేకము. మన పూర్వులకంటె నదృష్టవంతుల మగు మనము శ్రీరామచంద్రుని పట్టాభిషేకమును జూచెదము.

విజ – ముహూర్త మవ్యవధిగా నుంచబడినది. కాని యింతకంటె నుత్సవ మెన్నోమడుఁగు లధికముగ నుండును జుమా

సోమ – కృపణుఁడు ధనమునకుఁ బ్రాణమునకు లంకె దేశ దేశములనుండి బ్రాహ్మణులు రాజన్యులు వచ్చినయెడల వారివిషయమై విశేషవ్యయమగునని యెవ్వరు రాకుండునట్టు లింత నిరవకాశముగ నేర్పాటు చేసినాఁడు. అదిగాక ముహూర్తముమాత్ర మేమంత బాగుగనున్నది? లగ్నమును శని చూచుచున్నాఁడు.

విజ – అట్టి బలహీనమైన ముహూర్తమును వసిష్ఠుడేల నిర్ణయించెను ?

సోమ - అటుఁ జేమిచేయఁగలఁడు? భూపతుల ముహూర్తములు దుష్టపతుల కోరికలవలెఁ దలచుకొనినప్పుడే సమకూడవలసినవి కావా?

విజ - సామాన్యకార్యముల ముహూర్తములు తొందరగ నిర్ణయించిన బాధ యుండదు కాని యిట్టి మహాకార్యముల ముహూర్తము లపర్యాలోచనముగ స్థిరపర చిన నాపత్తుకాదా? (లెంపలు వైచుకొని) అపచారము వచ్చినది.

గీ. లగ్నమునకు రాఘవుని బలంబు గాని
రామునికి లగ్నబలముతో నేమి యగును?
సుమవితతికి వసంతునిశోభ గాని
సుమనిధానమునకు సుమశోభ యేల?

(నేపథ్యమున) దిగు దిగు ఉండలబద్దయేది లే! లే!

సోమ - అదేమి? అదేమి? అల్లరి యగుచున్నదేమి?

విజ - (అటులిటులు చూచి) అదిగో కైకేయి మేడపై కొండ్రముచ్చు. జనులు దానిని బెదరఁగొట్టుచున్నారు.

సోమ - (నవ్వుచు) కాదు కైకేయిదాసి-నల్లని కురూపయగుటచేతను గూని దగుటచేత నల్లరిమూకలైన జను లట్లు పరిహసించుచున్నారు. మిత్రమా సంధ్యా సమయమైనది చూడు.

గీ. నను గమించు తేజశ్శాలి తనకులంబు
వన్నెకెక్క రాజౌనని సన్నుహితుఁడు
దేహ ముప్పొంగ రాగసందీప్తుఁ డగుచు
మోదమున మున్గునట్లు లంబుధిని గ్రుంకె.

మన మికఁ మనయిండ్లకుఁ బోదము రమ్ము.

విజ - మన రామచంద్రుఁడును, జానకియు నీరాత్రి యుపవసింతురట! అట్టిచో మన మేల భుజింపవలయును? మనముకూడ భోజనములు మాని జాగరము సేయుదము.

సోమ - అభ్యంతర మేమి?

విజ - బాగుగఁ బరిశీలింపుము. కొండముచ్చే గాని కైకేయీ పరిచారిక కాదు సుమా?

సోమ - మంచివాఁడవు, ఇక్కడనుండి చూడుము సందేహ మేమి? కొండ ముచ్చింత వికృతరూపముగలదిగ నుండునా?

గీ. ఆదికూర్మముపై మందరాద్రి నిలిచె
మున్ను; కాలము వ్యత్యయంబుగఁ జెలంగ,

నిపుడు మందరోపరి గూర్మపృష్ఠ మెక్క
ననఁగ, నదె వక్రబుద్ధిలాంఛనము గాను.

కావున నిశ్చయముగ మంథరయే.

విజ - మిత్రమా దాని పేరు మందర కాదు మంథర.

సోమ - ఏదియో యొకటి; కాలవ్యత్యయ మైనపుడు వర్ణవ్యత్యయ మాశ్చర్య మేమి? చూడు దాని మొగ మెట్లు మాడియున్నట్లున్నదో? ఈయుత్సవములు దానకు రుచించినవి కావి కాఁబోలు

(నవ్వుచు) రామపట్టాభిషేకమే దీని కభిమతము కాదు కాఁబోలు? ఏదో కైకేయితోఁ దలపోసికొనుటకు వచ్చినట్లున్నది. మనము మఱియొకవీధికిఁ బోయి వేడుకఁ జూచెదము రమ్ము. (ఇద్దరు నిష్క్రమించుచున్నారు)

ఇది విష్కంభము

ప్రదేశము:—కైకేయి యంతఃపురము మేడ

(ప్రవేశము:—మంథర)

మంథ — ఏమి! ఈ యుఱుకు లేమి? ఈపరుగులేమి? ఈగుఱ్ఱపుబండ్ల కిరకిర లేమి? ఆ యేనుఁగుల ఘణఘణ లేమి? ఆజెండాల తడతడ లేమి? ఈ బూడిదబుస్స న్నల పనసలేమి? ఆగొల్లకాల గోలయేమి? ఈ పంగ నామాలపందల తందనాలేమి ఈ తోరణము లేమి? ఈ వీరణము లేమి? ఆ!ఆ! ఈ తప్పెటలేమి? ఈ గంతులేమి? ఈ చిందులేమి? (మఱియొకవైపునకు దిరిగి) ఆ! ఆ! ఏమి యీవింత; ఏమి యీ మహోపద్రవము. జాయి ద్రవించుచున్నది. ఆయుఃపిండమునుండి యమృత మొలుకు చున్నది. ఆ! గొంతుఁ గోసికొందునన్నను క్రొత్త కాసాకనిచేతఁ బెట్టని క్రోతి పిడికిటి కౌసల్యకుఁ గొండంతయీడి యొక్కమాటే కలిగినది! ఇది లోకోత్పాతమే! అబ్బ! ఏమి దక్షిణలు! ఏమి గానములు! ఈజంగమములపంద లీ మహాభాగ్యములకై యెట్లు మూఁగుచున్నారో! దానశీల యని సిగ్గులేక దిక్కుమాలిన కవు లెట్లు స్తోత్రములఁ జేయుచున్నారో! (చప్పటులు జఱచుచు) ఓసి కావేరీ! కావేరీ! ఈ గందరగోళములో నెవరికి వినఁబడును? ఓసి మీగొంతుకలు కోయ్య! నోరు మూసి కొనుఁడు. ఓసీ కావేరీ! కావేరీ!

(నేపథ్యమున) ఎందులకు?

మం—మీయమ్మ నేఁడు బ్రాహ్మణసంతర్పణము జేయుచున్నదేల?

(నేపథ్యమున) ఎందులకో యెఱుఁగవా?

మం—ఎఱిఁగియుండిన నడుగుదునా? జ్యేష్ఠదేవిగారి పరిచారికలగు మీకే సంగతియైన మొదట తెలియుఁ గాని యూరు పేరులేని యధోదేవులను గనిపెట్టు కొనియున్న మాకుఁ దెలియునా?

(నేపథ్యమున) (నవ్వుచు) అధోదేవు లని క్రొత్తమాట చెప్పుచున్నావేమి?

మం—నా క్రొత్తమాటకేమి కాని, మా దేవిగారి క్రొత్తచేష్ట కేమి కారణమో చెప్పు?

(నేపథ్యమున) సుగుణరితుఁడు.

మం—ఊఁ.

(నేపథ్యమున) శాంతవచోయుతుఁడు

మం—అబ్బ! త్వరగా నేడువరాదా? ఇక మీ కింతే.

(నేపథ్యమున) అగు రామచంద్రుని.

మం—అబ్బ! చెప్పరాదా?

(నేపథ్యమున) పట్టాభిషేకము.

మం—ఆ! నిజముగానె? ఎప్పుడు?

(నేపథ్యమున) ఎప్పుడోనా? తెల్లవారుసరికి.

మం—ఇప్పుడీతని పట్టాభిషేకమున కింత తొందరయేమి? మహారాజు బాగుగ నున్నాడా?

(నేపథ్యమున) అటు లడిగెద వేల?

మం—ఏమియులేదు. అతఁడు మా దేవిగారి యింటికి యుదయమునుండి యిప్పటివరకు రాలేదులే.

(నేపథ్యమున) లేక ముందుకూడా నటులే జరుగు నేమోలే.

మం—తెగసాగకపో.

(నేపథ్యమున) సాఁగవేసినసరే - చంపినసరే గూనుమాత్రము వదలదు.

మం—(తనలో) సుగుణరహితుఁడు శాంతవచోయుతుఁడు నగు రామభద్రుని పట్టాభిషేక మనుటకింటె, సుగుణరితుడు శాంతవచోయుతుఁడునగు భరతునిపట్టాభిషేక మనుట శ్రవణానందకరముగ నుండును గాదా! రామభద్రుఁడు రేపు పట్టభద్రుడగునా? అది మొదలు తుద యెఱుఁగని దశరథుని యాజ్ఞయా? అందులకు మూలఁ గూరుచుండి ముక్కుమూసికొని మహాత్ముఁడైన ముసలిముని యామోదమా? అందుపైఁ గలలోనైన జిల్లిగవ్వ విడుచుటెఱుఁగని కౌశల్యాదేవి భూసురసమారాధనమా? అదిగాక యీ మూఢజనులు చెడద్రాగి యొడలు తెలియక తెయితక్కలా? ఏమి వింతగ నున్నది! చూచెదనుగాక! కైకేయీ! కైకేయీ! మేడపైలేదు. వేడుకఁజూడ దిగినదికాఁబోలును! ఆ! ఏమిది! ఏమిది! కొంపలుగాలినట్లు వెలుతురేమి? రామపట్టాభిషేకమునకై స్త్రీలు దీపములు ముట్టించుచున్నారా! ఆమహోత్సవమునకే నేనుఁగూడ నొకవింత యగ్ని నిక్కడ ముట్టించెదను. వీరు ముట్టించిన యగ్ని తెల్లవాఱుసరికి నాఱునుగాని నే నంటించుచిచ్చు రేయింబగళ్లు విచ్ఛిన్నముగ సంవత్సరములకొలఁది నుండును. వీరి

మంథ — భరతుని మొగమునకు నా మొగమునకు ప్రజలింత పండుగఁ జేయుదురా? భరతుని జన్మదినమున నిట్టిపండుగ జరిగియున్నదా? భరతుని వివాహమున నిట్టివైభవము తటస్థించెనా? భరతుఁడు మేనమామగృహమున కేగుట యను తెలియంగనైన నెఱుఁగుదురా? ఇట్టిచో భరతుఁ డిప్పుడు తిరిగవచ్చుచుండుటచేత జరుగు మహాపర్వమును జరుపుచుండి రనుచుంటివా! భరతునిగొడవ ప్రజలకు గావలయు ననుకొంటివా? భరతునిగొప్ప నీకును నాకును గాని యూరివారి కేమి?

కైక — ఇటు లనెద వేల? భరతుఁడు జనసమ్మతుఁడు కాని యిప్పుడీ సంతోష విజృంభణమునకుఁ గారణ మేమి?

మంథ — చెప్పనా? చెప్పిన నీకు మనోవ్యథగ నుండు నేమో?

కైక — చెప్పు. ఉండిన నేమి చేయఁగలను?

మంథ — ఏమి చేయుటకైనను నీవు శక్తిగలదానవే.

కైక — కానిమ్ము చెప్పు.

మంథ — రేపు రాముని పట్టాభిషేకము.

కైక — ఆ: ఆ! నిజముగా నే?

మంథ — నిస్సందేహముగా.

కైక — (మంథరను కౌగలించుకొని) చిరకాలమునుండి విననెంచిన యమృత తుల్యవాక్యములను జెప్పితివి!

మంథ — అటులైన రామపట్టాభిషేకము నీకు సంతోషకరమేనా?

కైక — అవశ్యము — నీకుమాత్రమో?

మంథ — (స్వగతము) ఈమెకు రామునిపై నసూయ గలిగించుట దుష్కరమగునని తోఁచెను. కావున మరియొకరీతి ప్రయోగించెదను. (ప్రకాశముగ) సవతికొడుకు సామ్రాజ్యపట్టాభిషేకమునకు నీవే యింతగ సంతసించుచుండ స్త్రీరత్నమైన నాకేమి? కాని యీ పట్టాభిషేకమునుగూర్చి యింతవరకు నీకుఁ దెలియకపోవుట నిజమేనా?

కైక — నిజమే, తెలియదు.

మంథ — ఎందుచేత?

కైక — కారణ మూహింపలేకున్నాను.

మంథ — అనినఁ గోపము — గాని — నీ మగఁడు —

కైక — (తొందరతో) అతఁ డేమి? అతఁ డేమి?

మంథ — ఏమియు లేదు — మంచివాఁడు కాఁడు.

కైక — అనఁగా —

మంథ — ధారాళమైన యంతఃకరణము కలవాఁడు కాడు ముద్దులిటు — మూటలటు — మాటలిటు చేష్టలటు — పైపై వెలుగువలపు లిటు — లోలోని మమకారము లటు — పనికిమాలినయెడ లిటు — ప్రాణమటు.

కైక — (కోపముతో) అదెటు?

మంథ — ఏటో చెప్పవలెనా? నీవెఱుఁగవా? నీకనుభవములేదా? ఇప్పటి వఱకు ముప్పాతిప్పలఁ బెట్టుచున్నదే! ఎవరని నన్నడిగెద వేల?

కైక — కౌసల్యయేనా?

మంథ — కాదా? ఆమెతోఁ జేరి మూఁడుమాసములనుండి యొక్కఁడే గుసగుసలఁటే! ఇంతకాలమునుండి పట్టాభిషేక ప్రయత్నం జరుగుచుండ నిప్పుడా నీకు దానినిగూర్చి తెలియవలసినది? అదియైన నేను చెప్పఁగఁ దెలియవలసినదా? నాకైన నూరంతయు గగ్గోలైనపిమ్మటఁ దెలియవలసినదా? ఇదియేనా నీమగని యనురాగము? ఈమాత్ర సౌభాగ్యమునకే పెనిమిటిని వశముచేసికొంటినని యుబికియుబికి యుబ్బొంగుచుంటివా?

కైక — ఆ. ఆ. మూఁడుమాసములనుండి పట్టాభిషేకమును గురించిన రహస్యములు జరుగుచున్నవా?

మంథ — జరుగుచుండుటలేదా? స్వాధీనుఁడైన మగఁడు అనురాగవతియైన భార్యయైనపుడు వారి ప్రయత్నములు రహస్యములై యుండవా? నీతో నెవరు చెప్పెదరు? నీతో డెవరికిఁ గావలయును? అదిగాక నీ ప్రసక్తియేమున్నది? నీవేమి పట్టపుదేవివా? పతి ప్రేమాస్పదవా? భాగ్యవతివా? పక్కలోని బానిసతనమునకై పసపుత్రాళ్లు గట్టఁబడినవారిలో నందరికంటే నీ యాధిక్య మేమి?

కైక — అబ్బ! నీ మాటలు నేను సహింపలేకుంటిని — ఊరకుండుము.

మంథ — అభిమానముచే నటమ్మ నా మాటలు నీవు సహింపఁగలవా? ఇంతగా జేసిన మగనినడత సహింపఁగలవు — కాని —

కైక — అబ్బ! నామగనినడత నేను సహింపలేదు. అతనిని గాని, నిన్నే గాటఁ బెట్టి యెట్టు లడిగెదనో! ఈసంగతి నాకింతకుముందు తెలిసియుండిన యెడల నేనూరకుందు ననుకొంటివా? నేనంత యభిమానము లేనిదాననా? నాకంటెఁ దనకిప్పుడు కౌసల్య యధికమయ్యెనా? "నీవే నా బహిఃప్రాణమవు — నీవే నా సర్వస్వమవు" అని పలికిన చిలుకపలుకు లెక్కడకఁ బోయెనో నిలువబెట్టి యడుగనా? అంత చేతకాని దాన ననుకొంటివా? అంత నోరుమాలినదాన ననుకొంటివా? రానీ! అతనిని రానీ!

మంథ — ఇఁక నేలవచ్చును! ఇఁక రాఁడు ఈ యుదయమున వచ్చినాఁడా? ఈ మధ్యాహ్నమున వచ్చినాఁడా? సాయాహ్నమున నీతో సంధ్యావందనమున విహరించుటకు యథాప్రకారముగ వచ్చినాఁడా? ఇప్పటికి వచ్చినాఁడా? ఇఁక ముందు వచ్చునని యేల నమ్మవలయును?

కైక — రాకపోవుటకూడనా? ఆఁ! రాకపోవుటకూడనా? నేను బ్రదికి యుండఁగ — నే నిక్కడ నుండఁగా నంత గుండె నిబ్బరమా?

మంథ — వెఱ్ఱిదానా! ఏమి జరుగనున్నదో యాలసంతతమైన కాలువు[illegible]ని నిక్కడ నుండనిచ్చునా?

కైక - ఉండనీయక?

మంథ - నిన్నుఁ గౌసల్యాదేవి ప్రోత్సాహముచేఁ బుట్టినింటికిఁ బంప నిశ్చయించుకొనినాఁడు.

కైక - ఛీ! నన్నేల పంపును?

మంథ - భరతుని నేల పంపినాఁడు?

కైక - భరతునిఁ గౌసల్య ప్రోద్బలముచేఁ బంపలేదే!

మంథ - నీకున్న వెఱ్ఱితనమే యిది. ఆతఁ డిచ్చట నుండిన రామపట్టాభిషేకము జరుగదని మేనమామయింటికి మెడఁబట్టి గెంటినాఁడు.

కైక - ఆఁ ఆఁ నిజముగా నామగఁడే గెంటినాఁడా? నామగఁడే?

మంథ - మగఁడో! మొద్దులో! మగఁడే కాఁడు - మగనితో నీసవతిగూడ గెంటినది

కైక - ఆఆఁ - ఆఁ. దానిసకూడ తోడైనదా! (ఉస్సురనుచు) దాని ననవలసినదేమున్నది? నానాథుఁడు దోషి - నానాథుఁడే ద్రోహి... నానాథుఁడే విషస్వభావుఁడు. ఏమీ! నాతో జెప్పకపోవుటయేల! నాతో నాలోచింపకపోవుట యేల? పోనీ? స్థిరపఱచుకొనిన తరువాతనైనను నాతోఁ జెప్పగూడదా? రాముని పట్టాభిషేకమునకు నే నభ్యంతరపెట్టుదునా? నాకు రాముఁ డొకటియు, భరతుఁ డొకటియునా? సవతికొడుకులను భేద ముండవలసిన యాఁడుదాన నైన నాకే భేదము లేనపుడు తండ్రియైన తనకేల యుండవలయును? ఈ దొంగతనమేల? ఈ భయమేల? ఈ సందేహమేల? నాకొడుకును గెంటనేల? ఈ దౌర్జన్యమేల? మంథరా! ఇఁక నాపతి నాయంతఃపురమునకు రాఁ డంటివా? రాకపోవును సుమీ!

మంథ - వచ్చునని యే నిశ్చయపఱచుము. అప్పు వచ్చిన లాభ మేమున్నది?

కైక - ఏమి?

మంథ - తెల్లవాఱునప్పటికి రామపట్టాభిషేక మగునెడల నీ పతికిఁ బ్రభుత్వము నశించును గాదా! ఒక డింతిపెట్టుగఁ దానే తినవలసియుండిన సేవకావృత్తి కాతఁడు దిగినపుడు నీ కేమిచేయగలఁడు? నేను నీయింటికివచ్చి నీకెంత మేలు సేయఁగలనో యెపటినుండి యాతఁడు వచ్చిగూడ నంతకంటె నేమున్నది?

కైక - అయిన నిక నేనేమి చేయవలసియున్నది.

మంథ - రామపట్టాభిషేకము నీ కంగీకృతకార్యము కావున మన మిద్దఱ మొక్కటే పని చేయవలసియున్నది.

కైక - ఏ దది?

మంథ - సేవావృత్తి.

కైక - (కోపముతో) ఏమి? ఏమి?

మంథ - నీ వొకసురటియు నేనొక చామరము బుచ్చుకొని కౌసల్యాదేవికి రాజమాతకింత విసరవలసియున్నది.

కైక - ఛీ! కాఱులు ప్రేలక నోరు గట్టికొనుము.

మంథ - నాపైఁగోపమేల? రాముడు ప్రభుడైనపుడు కౌసల్యామహాదేవికే సమస్తగౌరవములు జరుగవలసియున్నది ఇఁక నీవును నాకు నామహారాజ్ఞిపాదసేవ తప్పదు తప్పదు. ముమ్మాటికిఁ దప్పదు. ఆజన్మమహాభాగ్యకలితవై, యింతవఱకు బత్యనురాగ నిధానమవై, మహావైభవమనుభవించిన నీకా పరిచర్య యలవాటు లేకపోవుటచేత నందులోఁగూడ నీకు దిట్లు మొట్లుదప్పవు కాబోలునని నేనేడ్చుచున్నాను.

కైక - ఛీ! ఛీ! పలుమాటలాడెదవా? పతి నరచేతిలో నిమ్మపండువలె నాడించిన నేను భ్రూభంగము చేతనే దానవసంహారి యగు దశరథుని గడగడలాడించిన నేను కాంతుని సంపూర్ణవశంవదునిగఁ జేసికొని సవతుల నంపతిని గివెట్టించిన నేను పరమాభిమానధనయైన నేను నేఁడిప్పుడు కన్నులుతెఱువని బుడుతని సింహాసనముపై సింగారించినతత్పాత్రియున, నాదౌర్భాగ్యమును వదలి, యభిమానమును బరిత్యజించి, యహంకృతిని జంపుకొని, స్వాతంత్ర్యమును మన్నుజేసికొని యా - పనికి మాలిన దానిని గొలుతునా? దానితో మాటలాడుదునా? దానివంక జూడనైన జూతునా?

మంద - ఇవియన్నియు వెనుకటి ప్రగల్భతలు.

కైక - వెనుకటి ప్రగల్భతలో, యిప్పటి సమర్థతలో. కాని చూచెదము.

మంథ - కనుల నీరుబెట్టుకొని రాముని రామ పట్టాభిషేకమును-

కైక - కన్నీరు నేనువిడుతును నా సవతిచేత విడిపింతును.

మంథ - పట్టాభిషేక మాగినప్పుడు కదా!

మంద - ఆగని వేళయైనదా? రాముడు కానీ! గీముడు కాని! నామర్యాద పోవునపుడు నేను నోరుమూసుకొందునా? ఈ బొందిలోనిజీవము లెగిరిపోవుటయైన సంతోషపూర్వకముగ నంగీకరింతును గాని నా సవతి యుచ్ఛ్రితను నేను సహింతునా? అందులో నాకనుసన్న మెలఁగిన సవతి - నన్నుజూచి దొంగమొగము వైచికొని చల్లచల్లగ జాఱిన సవతి తనపై నాధునితో నే నెప్పుడేమి చెప్పెదనోయని తల్లడిల్లుచుండు సవతి యిప్పుడు నాపుత్రుని మాతామహగృహమున కంపి తనకొడుకును సింహాసనాధిష్ఠితను జేయదలచి నా పెనిమిటిని మూలఁ గూర్చుండబెట్టి, నన్ను బుట్టినింటికి తోసిపెట్టనెంచి కౌసల్యమసి, యేకచ్ఛత్రముగ బుత్రుని సౌపము బెట్టుకొని క్షోణీతలము నేలదలచిన సిగ్గుమాలినదాని నా కాలిక్రింద రాయుదును గాని ఆఁ! ఆ! కైకేయిని ప్రవ్వదుఱింపినట్లు త్రుంపవలెనని యెంచుచున్నది. కాబోలు! నాకుత్తుకనైన గోసికొందును గాని-

మంథ - పట్టాభిషేకమును మొండికత్తిచే ని నాథుఁడు కోయనే కోసినాడు.

కైక - ఏమీ! పట్టాభిషేకమాఁగదా? అవ్యవధిగ నుండుటచే నభ్యంతర పెట్టబడదని సంకోచించుచుంటివా? కాని కౌసల్య చేసిన యీరాజ్యాభిషేక తంత్రము నాకింత నిరవకాశముగ నేల చెప్పితివి?

మంథ – నాకుఁ దెలియకుండ నే నెటులుఁ జెప్పగలను ?

కైక – నీకిప్పుడేనా తెలిసినది ? ఎవరు చెప్పిరి ?

మంథ – కావేరి.

కైక – సవతి దాసియేనా ?

మంథ – ఆఁ !

కైక – ఏమని చెప్పెను ?

మంథ – ఏమున్నది ! చూచితివా నా ప్రజ్ఞ ! దశరథుని చెంగున ముడివైచు కొంటిని భరతుని కష్టకంటకుఁడాఁడు బద్ధవలె నిసరివైచితిని. కైకేయికి ముక్కుతాడు బోసి యాడ్పింతును. ఏమున్నది? రామచంద్రుని శిరముపై గిరీటము; కైకేయి నెత్తిపై నిళ్ళకుండ" అని కౌశల్య తనతో జెప్పినట్లు కావేరి నాతో జెప్పినది.

కైక – (కోపముతో) ఆ ! నీచురాల ! ఛీ ! పరమతుచ్ఛురాలా, నన్ను నడివీధిని బెట్టి యేడుచుంటివా ? ఛీ ! పలుగాకీ నిన్ను కోటముందు గొల్లున గోల బెట్టించనియెడల నేను కేకయాత్మజను గాను జాగ్రత్త !

మంథ – నీవు పూర్ణముగ దలచుకొనినయెడల నది కష్టసాధ్యమగు కార్యము కాదు కాని, నీ చలచిత్తత నిన్నెక్కడ పాడుచేయునో యని నే నాందోళన పడు చుంటిని;

కైక – ఒక్కటియేమాట రాముని పట్టాభిషేకము భిన్నమైనదుమ్ము.

మంథ – సంతోషమే – కాని, అంతమాత్రముచేత నే నీ కార్యసిద్ధి యెటులు కలుగ గలదు ?

కైక – అందులకేమి చేయమంటివి ?

మంథ – కౌశల్య చేసిన పాపతంత్రములు రెండు – మొదటిది భరతుని రాష్ట్ర పరిత్యాగం జేయుట–రెండవది రాముని రాజుచేయుట–ఇట్టి కుతంత్రము విఫలితమగుటకు నెటులుండవలయునన్న–రాముని ద్వక్తరాష్ట్రుని జేయుట–భరతుని రాజు గా జేయుట

కైక – (ఆలోచించి) జ్యేష్ఠత్వముచే రాజ్యార్హుడగు రాముఁడుండఁ జిన్నవాడైన భరతుని రాజుగాఁ జేయుటకు రాజంగీకరించునా? అంతేకాక రామునికి న్యాయమైన రాజ్యమును భరతుఁడు స్వీకరించినా స్వీకరించడు.

మంథ – జ్యేష్ఠతవలన నే సురహాతయు యోగ్యతయు గలుగునా? క్షీరసముద్రమున నమృతముకంటె విషము ముందుద్భవింపలేదా ?

కైక – (పెదవి విఱిచి) కాని, యగ్రజుఁడగు రాముఁడుండ భరతునికి బట్ట ముగట్టు యనూచానవిరోధమని వసిష్ఠాదు లంగీకరింపరని తోఁచుచున్నది.

మంథ – "అగ్రజుడగు రాముండ," నను సందేహమేల ? అందుకొరకే ప్రథమమందు రాముని ద్వక్తరాష్ట్రునిచేయవలయునని చెప్పితిని. రాముఁడెటులుఁ వాసమేగినచో నున్న వారిలో భరతుఁడు జ్యేష్ఠుఁడు కాఁడా ? వంశాచారవిరుద్ధతకు

మున్నది? ఇక రాజార్హమగు రాజ్యమని భరతున కాక్షేపణ మేమియుండును? భరతాభిషేకమునకు వసిష్ఠాదు లంగీకరింపరని తోఁచుచున్నదంటివి. ఇచ్చువాఁడు సర్వస్వతంత్రుఁడైన తండ్రి; పుచ్చుకొనువాఁడు సర్వమంగళగుణాలంకృతుఁడైన జ్యేష్ఠసుతుఁడు, ఇమ్మని చెప్పువారు పరమప్రియులగు భాగ్యరాశిచో మధ్యమునఁ బౌరోహిత్యపుఁ గాసునకై వచ్చిన వసిష్ఠుని యధికార మేమున్నది? నీచిత్తవృత్తికున్న లోపమే యిది. అనవసరములగు సందేహములఁ దెచ్చిపెట్టుకొందువు వసిష్ఠుఁ డంగీకరింపఁడని చెప్పుటవలన నాకొక యాపద గలుగుచున్నది.

కైక — ఏమది?

మంథ — నీభర్త యంగీకరించునట్లు నీవు స్థిరపరుచుకొంటివని.

కైక — అట్టినిశ్చయ మెక్కడిదిలే. రామపట్టాభిషేకమునకుమాత్ర మంతరాయము కలిగింపవచ్చును.

మంథ — అంతమాత్రమువలన నేమిలాభ మున్నది? అదిగాక దానివలన మిక్కిలి ముప్పున్నది.

కైక — ఏ దది?

మంథ — కౌసల్యాపుత్రునికే పట్టాభిషేకము చేయ రాజసంకల్పమగుటచే నీ సపత్నులకుఁ బ్రజలకు బానిసలకుఁగూడ నీయందు గౌరవము సంపూర్ణముగ నశించినది. అట్టిచో నొక్క రామపట్టాభిషేకవిఘాతకమే చేసి నీవూరకున్నచో నిప్పటిగౌరవహైన్యమునకుఁ గావలసినంతనింద తోడుపడును ప్రజలకు నీపై శత్రుత్వము ప్రబలును. రామలక్ష్మణులు నిన్ను యమపురమంపనెంతురు. అదిగాక, బలాత్కృష్టాంగీకారము గావున నీపతిగూడా వారిలో జేరి యీ పిశాచము వదలిన మంచిదేయనియే యూహించును అట్టిచో భరతుడు రాజుగ జేయబడివుండిన. పరిజనులు నోరెత్తుదురా? రాజమాత వగుటచేత నీయందరి కెంతగౌరవముండును? నిన్నిప్పుడు కాదని నిరాకరించిన కౌశల్య నీ పాదాక్రాంతయగుట నిశ్చయము కాదా! నీకింత మహాకస్మికోపద్రవమును దెచ్చిపెట్టిన యామెను రాచి అంపమున బెట్టుట నీకు ప్రతివిధి కాదా? సపత్నిపై పగదీర్చుకొనలేని సతిబ్రతు కేల?

కైక — (కోపముతో) ఆఁ! ఆఁ తీర్చుకొనక యూరకుందునా? ఎప్పటికైనను సరే యీ బొందిలో ప్రాణములు నిలిచియుండగ దానిని దలచుకొనినంతపని చేయకుందునా?

మంథ — ముఖ్యకాలము దాటిపోయినపిమ్మట నెప్పటికో నీవు చేయగలది రోదనమే.

కైక — ఛీ! ఛీ! నీ తల్లిపాలచే నేనును నీవును పెరిగిన చనువుచేత నీవను కఠినవాక్యముల కింతసేపటినుండి సహింపలేక శాంతించుచుంటిని. ఇక జాగ్రత్త.

మంథ — ఆయభిమానముచేతనే యింతగా నేడ్చుచున్నాను. ఇందుకొరకు నాపై బగ సాధింపదలచితివా? ఏమి సౌలభ్యముగ నున్నది? ఇంతకాలమునిన్ను నెత్తిపై బెట్టుకొని యూరేగి తుదకు నేలను భల్లున విసరికొట్టిన నీ నాథునిపై బగ

లేదా? నీనాథునకు మందుపెట్టి, నీకంటిలో మట్టిఁగొట్టి, నీకొడుకు నింటినుండి వెడలఁగొట్టి నిన్ను ముప్పతిప్పలఁబెట్టుచున్న నీసవతిపై నీకుఁ బగలేదా? ఎంత విరుద్ధము! ఎంతవిరుద్ధము! ఒక్క పాలబతికి యొక్కప్రక్క బండి యొక్కతలపు గలిగి యొక్కరీతిగ నిన్ను గనిపెట్టుకొనియుండి సర్వదా నీక్షేమముగోరి "ఈబాం దినాఁడ" యని యింతగా ప్రాకులాడు పరిచారికనైన నాపైనే నీకుఁబగయా ?

కైక — ఆహా! ఇక చాలు! ఇక చాలు! ప్రస్తుత భరతపట్టాభిషేకమునకు సాధన మేదో ముందు చెప్పుము.

మంథ — ఆలాగ అడుగరాదా? తొల్లి దేవాసురయుద్ధమున నీవు నిపతియును-

కైక - అదేమి? కృతయుగ కార్యమైన దేవాసురయుద్ధమునకు నేమ పట్టినదే!

మంథ - అదిగో! ఇట్టి గడుసుదనపుమాటలుమాత్ర మున్నవి. గవ్వ విలువ చేయని పలుకులు నివి; రాజ్యములు విలువచేయు కార్యములు గోపల్యవి. అందుచేతనే యీపెద్దమ్మ పెద్దమ్మరూపముగ నినెత్తిపైఁ దాండవించుచున్నది.

కైక - అబ్బ! వదరక చెప్పవలసినదేదో చెప్పు.

మంథ - కుశంకల జేయక వినదగిన దేదో విను. తిమిధ్వజునికి దేవేంద్రునికి జరిగినయుద్ధములో రణశూరవకునిను ని నాథుడు తీసికొని దేవేంద్ర సహాయ్యమునకై పోలేదా ?

కైక - అవునుసుమా ! ఎంతటి పూర్వవృత్తాంతమును జ్ఞప్తికి దెచ్చితివి.

మంథ - పూర్వవృత్తాంతమే కాదు. ప్రస్తుతావశ్యకమైనది కూడాను.

కైక - కాని అప్పుడు ?

మంథ - రాక్షససాయక వ్రణపీడితుండై మూర్ఛనొందిన ని కాంతుని రథమును యుద్ధశాస్త్రనిపుణవైన నివు దూరస్థలమునకుఁబోనిచ్చి నిలుప ని కాంతుడు మేల్కాని నిన్నుమెచ్చి యేమియిచ్చెనో జ్ఞప్తియున్నదా ?

కైక - అహా ! అహా ! రెండువరముల నిచ్చినాడు. ఇచ్చి కోరుకొమ్మనగ ముందెప్పుడైన గోరెదనని చెప్పితిని.

మంథ - అసమయ మిప్పుడు వచ్చినది. భరతుని పట్టాభిషేక మొకవరము; రామ వనవాసము రెండవరము.

కైక - ఇక నేమి ? ఇంక నేమి ? గెల్చితిమి అబ్బా ! ని కెంతధారణాశక్తియే ఈ తెలివి నికు గూనులో నున్నది కాని తలలో లేదు.

మంథ - పరిహాసమునకు గావలసినంత సమయము ముందున్నది. ప్రస్తుత కార్యమును జూడుము.

కైక - ఇంక జూచునదియేమి ? మన సంకల్పము నెఱవేరినది. చూడు ! చూడు ! కాని కావి.

మంథ - ఈచూడులు ని కానులటు పెట్టి కార్యమును బరికింపుము.

కైక - మనకు భరతపట్టాభిషేకముతోడనే సపత్ని సంపూర్ణముగ స్వాధీనయైవున సేవకురాలగునపుడు అవశ్యముగ రామువనవాస మేల ? వలదు. వలదు.

మంథ — అయ్యయ్యో! కోపము నుంగుకొనఁ దలఁచుకొంటివా? అయ్యయ్యో? ఇంతమారదృష్టి లేదేమి! రాముఁడు రాజ్యమందుండఁ భరతపట్టాభిషేక ప్రయోజనమేమున్నది? జను లందఱు రాముని పక్షులై యుండరు గదా? అంతేగాక? పరమశత్రువైన సవతికొడుకగుటచే నీ కొడుకునిపై యసూయాపరుఁడౌ సపత్నీజనితుఁడే లేక, నీవే యింత యభిమానముతో సంతోషించుచుండఁ దగునా? బుద్ధి రాజ్యసంపాదన సమర్థుఁడైన నెంత యనురాగముండునో యూహించుకొనలేవా? (గుండెలు కొట్టుకొని) అమ్మ! అమ్మ! రాముఁడు రాజ్యమందుండఁ బ్రతుకు బ్రతికియున్నవా? భరతునిరాజ్యము నిలుచునా? భరతుని ప్రాణములు నిలుచునా? అయ్యయ్యో! ఆ లక్ష్మణుఁడు! మిడిసి మిడిసి రాలువాఁడే! కోపస్వభావుఁడే! పగసాధించునంతవాఁడే! కొంప లంటింపఁడా? నిన్ను పాతర వేయింపఁడా? ఇది నమ్ముదు! అయ్యయ్యో! రాక్షసాక్షి వచ్చు రాముని కోపమున కెదురున్నవారి? నిమిషమైన ప్రాణ మొంచునా? సమస్తసైన్యము సమస్త భండారము చేతిలో నుండినను భరతుఁడు రాముని కీడు కాఁగలఁడా? అయ్యయ్యో! రాముఁడేమి సామాన్యుఁడా? పైకి మెత్తనివాఁడుగ నున్నాఁడనుకొనుచున్నావు కాబోలు ఎంతకఠినుఁడు! ఎంతపట్టుదలగలవాఁడు! ఎంత బాహుబలాఢ్యుఁడు! ఎంత పరాక్రమసంపన్నుఁడు! అయ్యయ్యో! రాముఁడే యొకఁడు నుండుటయే? తాటకాంతకుఁడైన రామునికిఁ గైకేయియు నొక రాణియని లెక్క — ఇంతవెఱ్ఱిపడుచున్నావేమి? గాధేయసవనసంరక్షణధురీణుఁడైన రాముఁడు త్ర్యంబకకోదండమహాస్త్రపరిగ్రహణ ప్రవీణుఁడైన రాముఁడు అమ్మయ్యో! పరశుధరదండవిఖండనుఁడైన రాముఁడు అయోధ్య నుండుటయే! ఇంతకంటె తెలివిమాలినయూహ యుండునా? అట్టిరాముని కగ్నికిఁ బ్రభంజనుఁడు తోడుపడ్డట్లు లా సౌమిత్రి అంటుకొన్నంతనే శత్రుఘ్నవలె వెలిపడు లక్ష్మణుఁడు — జ్యాటంకృతిమాత్రవిదళితదానవప్రవరుఁడగు లక్ష్మణుఁడు — ప్రళయ కాలరుద్రప్రతిమాన ప్రయివుఁడగు లక్ష్మణుఁడు — తోడుపడఁగఁ భరతుని నామమైన నిల్చునా! ఒక్కఁగా నొక్క కొడుకైన భరతుని జంపుకొనఁ దలఁచినయెడల రాముని యయోధ్యం దుండనిమ్ము.

కైక — మంథరా! నాబుద్ధి యింతవఱకు వ్యాపింపలేదు సుమా! రామవనవాస మవశ్యము జరుగవలసినదే.

మంథ — తథాస్తు.

కైక — ఇంక నానాథుఁ డిక్కడకు వచ్చు ప్రయత్న మాలోచింపవలయును నే నాతనిని జూడఁగోరితినని నీవు చెప్పవలదు. నీ వాతనితో మాటలాడ నేవలదు. నిన్నుఁ జూచి యాతఁడు కొఱకొఱలాడుచుండును. నీవు నాతో నేవో యెప్పటి కప్పు డాతనిగూర్చి కొండెములు చెప్పుచుందువని యాతని నమ్మకము. నేను మఱి యొకతెను బంపుదును.

మంథ — ఆతఁడే వచ్చును. ఆ ప్రయత్నమును నేను రహస్యముగఁ జేసితిను లే. కాని, నీవిప్పుడేమి చేయవలయునో యెఱుఁగుదునా?

కైక – నా కింతశ్రేయస్కరమైన యుపాయమును జెప్పినందులకు నిన్నుఁ గొని యాడవలసి యున్నది.

మంథ – చాలుచాలు. ఇప్పటిమాటలే. ఇది పూర్ణముగా ఫలించుసరికి నీవు నాతో మాటలాడుదువో లేదో, పోనిమ్ము! నీవు ముందు క్రోధాగారమును బ్రవేశింపవలయును.

కైక – అవియన్నియు నాకుఁ జెప్పనేల? ఆ పాట్లేవో నేను బడెదనుగాక!

మంథ – (నవ్వుచు) ముసలిమగనిని మూడువార్ధులనీరు ద్రాగింపఁగల సమర్థత నీకున్నదని యెఱుఁగనా? అటులైన నే నికఁబోయెదను. చూడు – రాముఁడెక్కెదఁ దలఁచిన సింహాసనముపై భరతు నధిష్ఠింపఁజేయుట – అంతకంటె ముఖ్యమైనది – రామబాణము మారీచు నెగరఁగొట్టినటులు – నీ కోపము – రాముని దండకారణ్యమునకుఁ ద్రోసివైచుటయే కాక – అక్కడనుండు శాఖామృగాదిసత్త్వములతో దక్షిణసముద్ర పర్యంతము తఱుముటయే కాక – ఆ సముద్రముఁగూడ దాఁటిపోవునట్లు చేయవలయును.

కైక – తథాస్తు నేను కోపమందిరమునకు బోవుదును.

మంథ – నేను నీభర్త నిప్పుడే జాగరూకతతో పంపెదను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.

## శ్రీ పట్టభంగరాఘవ మను

# పాదుకాపట్టాభిషేకము

---

## తృతీయాంకము

ప్రదేశము: —కైకేయి యంతఃపురములోని భాగము

(ప్రవేశము: — దశరథుఁడు.)

దశ—ఏమి? శయనగృహమైన యిచ్చటి కింక నేల రాలేదు?

గీ. విద్యలేనిముఖములాగు, విదయమైన
మనసటులు, లజ్జలేని సంభాషంబు
వలెను, శుభగతిలేని యౌవనము బోలె,
చెలువలేని యిచ్చోటు నిశ్శ్రీకమయ్యె.

గీ. అల్కి, పట్టు,జాల దనియు నిట్టిట్టిఁ
దగిన రుష, యల్కి యేడు, పంతటనె హాస;
ముంప సరసత్వాభినయముకంటె, సతి వి
చిత్రత యుద్ధాగమాట, రంజించు నన్ను.

గీ. కమ్రమధుకోశమున కీఁగకాటు, స్వర్ణ
కేతకికి ముండ్లపోటు, సంస్ఫీతచంద
న లతకుఁ బురుగురాటు, పొందంగఁదగిన
బోఁటిసౌఖ్యప్రపతుఁ జులుకుమాట వేటు.

గీ. మొదలె మూతిముడుపు గలముదిత, యందు
పైనఁ గొంటికచ్చువలె, గూనిబానిస యెదొ
నన్నుగుఁటిచి ముట్టించు; నంతటను బున్న
మనముఁబ్రేలును సుందుకాయులె, నబల.

అ శః పుర పరిచారకులారా! కైకేయిని మీరిక్కడ నెప్పుడు చూచితిరి?

గీ. కటికువాయి, వక్రగాత్రనైల్యము లున్న
గూనిదాసి, కొటుకు రానికొయ్య

గీ. మొద్దులాగున మొదలని ముదితకంటె
నెగసి బుస్సుల పైఁబడుముగువ ప్రియత
ర యగుఁగాదె! కాసారనీరంబుకంటె
నంబుయంత్రోత్థితాంబు పూరంబునలెను.

కాని, తిరిగి యీ గూనిదాసి నా ప్రియురాలితో నేమి తంత్రము పెట్టినదో యని భయంపడుచున్నాను. ఈ వకరిదేహమును కోటలోనికి రానియ్యకుండ నభ్యంతర పెట్టునెడల నన్నీయంతఃపురములోనికి రాకుండ గైకేయి వారించును కాన,

గీ. నవరసామోద మైన యీ నాతికొఱకు
గూనుదానిని గూడను గూడకట్టు
కొనగవలసె; వుద్గ్రంథాంబు కొఱకు చదకఁ
బెట్టఁబడిన కత్తెఁ గాళ్ళపీటఁబోలె

గీ. క్ష్మావధూభర్త లఖిలాధికారు లన్న
మాటయేకాని లోలోనిపోటు లన్ని
యెవరి కెఱుఁగంగవచ్చు? నా రెపుడు నగరు
నందుఁ గలదాసులకు దాసు లగుట నిజము.

గీ. లలితలక్షణలీలాకలాపరూప
మంజులము వైన కేకయాత్మజయుఁ గూడఁ
గుటిలయా మంధరనుగూడి కుటిలమయ్యె
వంకవెదురునఁ బ్రాకెడు నల్లివోలె.

(కొంచెము నడచుట నభినయించి) అదిగో! అదిగో! హా, ఎంతకష్టము.

సీ. కుడిచేయి తలక్రింద నెడమచేయి యెడమ
బుగ్గపైఁ గదియించి మోము వంచి
ధరణిచే నొకపయోధరమును సవ్యబా
హువున వేఱొకటియు నొత్తబడఁగ
మోకాళ్ళు దరిఁజేర్చి ముడిచి బిగ్గగ నుద
ర ప్రదేశమునఁ జేరంగ నదిమి
విరలితకచభార మొకకొంత ప్రక్కదు
ప్పటిగ వేఱొక కొంత పచ్చడముగ

గీ. శీతబాధను గుండెలరీతి బండు
మానిసినిబోలె నాకాంత లేనిపోని
కోపమునఁ బాముపలె బుసకొట్టు చదిగొ!
ప్రక్కపాటున శయనించు నట్టినేల.

గీ. రేపటిమహోత్సవం బేమి? రేయి నిప్పు
డిట్టి ప్రారబ్ధమేమి? హా! యెటులు కలిగె
నిద్ది యెటు కడతేఱునో? యెవ్వఁ డెఱుఁగు
నేమి సేయుదు దైవమా యిప్పుడు నేను?

గీ. ఏమి సేయుట కేమున్న దింతి కేటు
లైనఁ గోపశాంతి సేయంగవలయు
లేకయుండిన జీవము ల్నిలువఁగలవె
నెలఁత కైకేగన్న నా యసువులకు నెలవు.

గీ. కోపహరణ వాక్యకోటికిఁ గ్రొత్తగా
వెదకుకొనఁగవలెనె; వేయిపలుకులు
పల్లెవేసికొనిన పాఠ మున్నదికదా!
యొప్పఁజెప్పువాఁడ నవిదకడను.

(కైకేయిని సమీపించి) ప్రాణప్రియా! కైకేయీ! ఇదియేమి? ఇదియేమి? నావలన నపరాధమేమైన కలిగెనా? ఎందులకీకోపము? నీకు గో దస్థానమైన కౌసల్య నిన్నేమైన దూలనాడెనా? అయ్యో! మాటలాడవేమి? నీవు పరమాభిమానధనవని యెఱిగియుండియే, నీవు పాతివ్రత్యమాని వని యెఱిగియుండియు నీయెడ నిర్వారి ములంటి యుపచార మెవ్వరివలన నందునో యని వేయికన్నుల గనిపెట్టుచు, నిన్ను సమగౌరవపూర్వకముగ నాదరించుచు, నీ నిరంతరానుగ్రహ ప్రాప్తికి వేయిదేవుల నారాధించుచు, నీ ఛాయవలె నిన్ను సర్వదా నాశ్రయించుచు, నా యభిమానము, నా ప్రాణము, నా యాత్మ నీయందుంచుకొని విధేయుడనై నేను దినములు గడుపుకొనుచుండగా నయ్యయ్యో! తిరిగి యిదియేమి? ఈ కోపమేమి? నా పాపమేమి? ఈ రోష మేమి? నాదోషమేమి? పాపినాయుగా? పలుకవా? (కైకేయిపై జేయివైచి నిమురుచు) పరమవిధేయుండనైన నన్నిటులు నేయవలసినదని యాజ్ఞాపింపరాదా? నేను నీమాట కెదురాడుటకు సమర్థుడనా? ఇదిగో ఇటు చూడు! అబ్బ ఇటు చూడు! హరి హరీ! ఎంతకష్టము సంప్రాప్తించినది?

కైక — నీకర్మము కాదు నాకర్మము—నా ప్రారబ్ధము—నను మాటలాడింపకుము. "ఏమి వాంఛించితినో యడుగరాదా? ఆజ్ఞాపింపరాదా? నీకు వ్యతిరేకముగ బలుకుటకు నేను సమర్థుడనా? పరమవిధేయుడనై నీసేవ నాదరించుచుంటినిగదా!"

అంటివి హా! ఏమి మాటలు! ఏమి నడతలు! ఏమి శిక్ష్యములు! ఏమి సౌఖ్యములు, ఏమి ప్రణయములు! ఏమి వినయములు! ఏమి స్తోత్రవిధానములు! ఏమి నైచ్యానుసంధానములు, చాలు చాలు! నే నెఱుంగుదును; అభిమానమును విడిచి ధైర్యపడి "దేహి" యని నోరు తెఱచి చేయిచాఁచి నీపాదములపై నీడ్గిలఁబడి యడుగక యడుగక యడుగ వలసిన దానినైన నిన్న ర్థించినయెడల నీవు నాకోర్కె సమకూర్చెదవా? నా దీనత్వము బాపెదవా? నాముద్దు చెల్లించెదవా? ఎందులకు? ఎందులకు? కొండలుదాఁటి పోవు బూటకపుమాటలతో నేమి ప్రయోజనము? వలదు-వలదు-నేనడుగనక్కఱలేదు.

దశ - ఆహా! ఏమిమాటలాడుచుంటివి! నీ వడుగుటయును నేనంగీకరింపకపోవుట కూడనా? అటు లెప్పుడైన జరిగెనా? ఈతనువున జీవము లుండఁగ నటు లెన్నఁడైన సంభవించునా? ఎంతమాట! నీవర్థింపకుండనే నీచిత్తస్థము లగునభిలాషలను, నీముఖ లక్షణములఁబట్టియు, నీవాగ్వైఖరినిబట్టియు; నీపరిచారికలవలన దెలిసికొని యూనే నింతవరకు నెఱవేర్చుచు నీ పరిచర్యను జేయుచుంటినని నీ వెఱుఁగవా? నీ పరిచారిక లెఱుఁగరా? మనస్సాక్షి యెఱుఁగదా? లోక మెఱుఁగదా? పరిపాలించు భగవంతుఁ డెఱుఁగఁడా? నేను నీకు సర్వదా నమ్ముఁడనైతి ననుటకు నా దైన్యము ప్రబల నిదర్శనము కదా? లోకోత్తరమైన నీ సౌందర్యము ప్రబలతరమైన నిదర్శనము కాదా? ఓసి వెఱ్ఱిదానా? ముసలిదశరథునిముకుఁ బట్టుకొని యిష్టానుసార మాడించు ముద్దులయిల్లాలవతె యని యాబాలవృద్ధులలో నెవరి నడిగిననైనఁ గైకేయి, కైకేయి, యని వారేకగ్రీవముగఁ బలుకరా? అట్టి జనవాక్యమందులకుఁ బ్రబలతమనిదర్శనము కాదా? ఇంతయేల? నన్ను నా రాజ్యమును బాలించువది నీవేకదా?

కైక - ఉన్నదీమాటల బండారమే,

దశ:- మాటలబండారమో క్రియలనిదర్శనమో చూచెదవుగాక - అడుగు సర్వసిద్ధముగ నున్నాను.

కైక:- లేదనుటకు.

దశ:- కాదు. ఇఁక గోరదగినది లేదనిపించుటకు - నీకు నాపైఁ గోపములేదనిపించుటకు-పరమగంభీరమైన నాయనురాగమునకు లోపము లేదనిపించుటకు - వినుచున్నావా?

కైక.- అబ్బ, అబ్బ, శ్రవణానందముగ.

దశ:- మాటలచే శ్రవణానందమే కాదు. చేష్టలచే సంపూర్ణహృదయానందమీయ సిద్ధముగ నున్నాను. ఇప్పుడైన నమ్మెదవా?

కైక:- నీవప్పుడే యేమిచేసితివని నిన్ను నమ్మవలసినది? ఇంక నే నడుగ లేదు నీవు నిరాకరింప నేలేదు.

దశ- నిరాకరించుటయే? నా ప్రాణమైనా సరే కోరుము మారుమాటాడక నీపాదాగ్రములందు సమర్పింతును. కాని, కల్యాణీ నన్నేల విశ్వసింపవు?

కైక:- అవితాంగనాలోలుని నమ్మదగునా?

దశ:- (నవ్వుచు) నాకట్టి లౌల్యమును కలిగించిన యిట్టి జగన్మోహనాకారు నేల విశ్వసింపవలయును?

